242

REG. No. 757

శ్రీ

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ

బ్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.


సంపుటము 6 | 1914 ఏప్రియల్ | సంచిక 4


విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0.


చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and Published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

అభినవసరస్వతీ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు—

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | అళ్ళయాచార్యవిజయము | ... ... | రు. 0 | 4 | 0 |
| 2 | కరిణీకోద్ధారిణి | ... ... | 0 | 4 | 0 |
| 3 | వాసంతికాపరిణయము | | 0 | 4 | 0 |
| 4 | కంసవధము | ఇవి నాటకములు. | 0 | 8 | 0 |
| 5 | చమత్కారమంజరి | | | | |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర | ... ... | 0 | 2 | 0 |
| 7 | నీతిగీతలు (సుమతిశతకమునకు సంస్కృతము) | | 0 | 2 | 0 |
| 8 | వత్సల నీతిశతకము | ... ... | 0 | 1 | 6 |
| 9 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము | ... ... | 0 | 2 | 0 |
| 10 | అత్యద్భుతవిమర్శనము | ... ... | 0 | 5 | 0 |
| 11 | నర్సరావుపేట శతావధానము (తిరుపతివేంకటీయము) | | 0 | | |
| 12 | లక్ష్మీవిలాసము | ... ... | 0 | 4 | 0 |
| 13 | చిత్తూరుజిల్లా తీర్పువిమర్శనము | ... | 0 | 4 | 0 |
| 14 | పశ్యాంపుశ్యాం | ... ... | 0 | 2 | 0 |
| 15 | సంగదోషము | ... ... | 0 | 3 | 0 |
| 16 | పద్యశబ్దవిచారము | ... ... | 0 | 3 | 0 |
| 17 | వీరభాగవతము | ... ... | 1 | 4 | 0 |
| 18 | పులిందావివాహము | ... ... | 0 | 4 | 0 |
| 19 | గురిగింజ | ... ... | 0 | 1 | 0 |
| 20 | గుంటూరుసీమ, తిరుపతివేంకటీయము | ... | 1 | 0 | 0 |
| 21 | వేమవరాగ్రహారశతావధానము | ... | 0 | 12 | 0 |
| 22 | పిష్టపేషణము | ... ... | 0 | 1 | 0 |
| 23 | వ్యాసనిష్కాసనము | ... ... | 0 | 1 | 0 |

# అభినవసరస్వతి

సంపుట ౧. | జూనపాడు ఆనంద సం॥ చైత్రమాసము | సంచిక 4.

## కృతివిమర్శము.

హిందూమతము——ఇది బొబ్బిలిసంస్థానాధిపతులగు శ్రీ రావు సర్ శ్రీ వెంకటశ్వేతాచలపతిరంగారావుబహద్దర్ కే-సి-ఐ-ఇ మహారాజావారిచే వ్రాయఁబడిన యొకగ్రంథము. గ్రంథకర్త లనేకగ్రంథావలోడనచేసి యందున్నవున్నట్లుగ్రహింపక చర్చించి ముఖ్యాంశములఁ గనిపెట్టిన బుద్ధిశాలులు. మనహిందూమతమున ననేకావాంతరమతము లేర్పడి తన్మతాభిమానముతో నితరమతవిరుద్ధముగ సిద్ధాంతితములైన విషయము లనేకము లుండియున్న మాటనిజము. ఆవైషమ్యములన్నియు సమభావముతోఁ జర్చించి విద్వత్సాహాయ్యమున శ్రీరాజాగారు సర్వమతసమ్మతముగ నిందు విశదీకరించియున్నవారు. ద్రవ్యార్జనపరులైన దాంభికుల మాయలన్నియుఁ బటాపంచలు చేయఁబడియున్నవి. ఈ గ్రంథమందలియంశములఁజూడ శ్రీరాజాగా రనేకశాస్త్రప్రవేశముగలిగియు ననేకపురాణేతిహాసప్రబంధాదులంజూచియు ననేకవిద్వద్గోష్ఠిలో మెలంగియు నుండిరని స్పష్టముగాఁ జెప్పకతప్పదు. కొంచెముజమీలుగలవారికే వ్యవహారేతరకార్యవిచారణ కవకాశముదొరకక యుడ్డుగుడుచుకొనుచుండుట పలుచోట్లఁజూచుచున్నవారము. అట్టిస్థితిలో శ్రీరాజావారు పెద్దసంస్థానాధిపతులై తద్రాజ్యకార్యనిర్వహణ మొనర్చుకొనుచు నేతాదృగ్గ్రంథలేఖనమునకుఁ దగినంత బుద్ధివైశద్య మెట్లుసంపాదించిరో యాశ్చర్యకరమైనసంగతిగానున్నది. చాలపఱకు నవనాగరికులవలెఁ గేవలశ్రుతిస్మృతివిరుద్ధాచారప్రవర్తకులుగాకయుఁ బూర్వాచారపరాయణులవలెఁ గడుంగడు ఛాందసమునఁబోకయుఁ బురాణేతిహాసాదులలోఁ బెంచివ్రాసిన యసంగతములం ద్రోసివేసి ముఖ్యాంశములనే నోటుచేసి కృష్ణభగవానుల యందవ్యాజమైన సాత్వికభక్తితో విరాజిలుచు లోకోపకారముగఁ దమయభిప్రాయముల నన్నింటి నీగ్రంథమునఁ బ్రచురించిన శ్రీరాజావారి కెంతయుం గృతజ్ఞులమైయుండుట విధియని మాయభిప్రాయము.

శ్రీమహాభారత శ్రీమద్రామాయణవిమర్శము:— ఇదియును శ్రీబొబ్బిలిమహారాజావారిచేత స్రాయఁబడినది. భారత రామాయణము లలోఁ గవులు పెంచి వ్రాసిన యాయాస్థలములు చర్చించి చరిత్రకుఁ బ్రాముఖ్యములైనయంశములే గ్రాహ్యములని సిద్ధాంతీకరించియున్న వారు. గ్రంథ మనేకపండితులచే శ్లాఘింపఁబడియున్నది కావున మేము మరల విస్తరించి వ్రాయు టనవసరమని విరమింతుము.

సికింద్రాబాదుశతావధానము:—ఇందు జగత్ప్రసిద్ధవిద్వత్కవు లగు శ్రీతిరుపతి వెంకటేశ్వరుల శిష్యులు అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు చేసిన యవధానప్రబంధములు మున్నగునవి కలవు. మాపత్రిక ద్వారముననే శ్రీశాస్త్రిగారికవిత్వము పలుమందిరుచిఁజూచియుండిరి కావునఁ బద్యములు హృద్యములని మరల వ్రాయఁ బనిలేదు. విద్వద్గే యములగు నవధానములఁజేయనేర్చిన శ్రీ శాస్త్రిగారు విద్వద్ధేయమగు నీకాలపు నాశుకవనప్రభేదిటి బొబ్బిలిపాటంగూడఁ జిల్లగజనుల రంజిం చుటకై చెప్పసహించు యశస్సంపాదనమునకై యన్యదేశ సంచరణంబా నరించుతటి సికింద్రాబాదా నగరంబున నాంధ్రభాషాభివృద్ధికై పాటు పడెడి చిపురుపల్లఅప్పయ్యశాస్త్రి శివపురపు వీరభద్రపాకయాజి ప్రభృ తుల ప్రేరణనుండి చారుగొండవరహారియను నొక వణిగ్వర్యుఁడీయవ ధానము చేయించి బహూకృతులు సల్పుటయుఁ గ్రమముగా నవధాని గారు తమపాండిత్యకవిత్వాతిశయములఁ బట్టణమున వ్యాపింపఁ జేసి పౌ రులచే మహోత్సవములు పెక్కు లాచరించి బహూకరింపఁబడి ప్ర కృత మాత్మకూరుగద్వాలసంస్థానములలో యశోరమను రంగస్థలమున కెక్కించుచున్న వారు. ఈగ్రంథము వలయువారలు సికింద్రాబాదా యిమాంశావిబజారునను౦ఖ చిపురుపల్ల అప్పయ్యశాస్త్రిగారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును. వెల 0-2-0 లు.

వివిధపద్యగుచ్ఛము— ఇది పై చిపురుపల్ల అప్పయ్యశాస్త్రి యీ వెంకటాచలశాస్త్రిగార్లచే వివిధవిషయములలో వివిధావసరము ల వ్రాయఁబడిన పద్యములుగల యొకచిన్నపుస్తకము. దీని నొక్క మారె యవధానక్రమ మనుసరించి చెప్పలేదనియే కాని యవధానతు ల్యమనుటయే యున్నది. ఏకవిషయమున ననేకపద్యములున్న చోటమా

త్ర మవధానశక్తి ననుసరింపక మఱింత గ్రాహ్యములుగా నున్నయవి. ఇదియుఁ బైవారిపద్దనే పైవెలకే దొరకును.

సువర్ణమాల.—ఇది ప్రకృతము క్రోసూరు పోలీసుసబిన్స్పెక్టరగు సూరి పూర్ణానందముగారిచే రచియింపఁబడిన యొకనవల. ఇందు శివాజీప్రభువు దక్షిణదిగ్విజయయాత్రయొనరించి సువర్ణబాయిని బెండ్లాడుటలోనగు చరిత్రాంశములు కలవు. వీరికవిత్వ మిదివఱకు కొరెంపూడి మహోత్సవ సీసమాలికావిమర్శములోఁ జదువరుల కించుక రుచిఁజూపి యుంటిమి కాని యయ్యది చాలదు. అందును నది పద్యకవిత్వము. ఇది గద్యమై ముద్దులుమూటగట్టుచుఁ జరిత్రయగుటచే గ్రాహ్యమగుటయే కాక కవితామాధుర్యమునఁ బుస్తకము చేఁబూనినవానిని దుదవఱకుఁ జదువునంతవఱకు క్రిందఁబెట్టనీయనంతటి యుత్కృష్టదశలో నుండియున్నది. చాలవఱకు పురాణవిద్యాభ్యాసముచేతనే కాలముగడపి యాపై నారక్షకశాఖలో నుద్యోగపదవిఁబొంది యించుకవకాశము లేకయుండఁదగిన వీరి కింతటిమృదుమధురమగు నిర్దుష్టకవన మలవడుట కెంతయో సంతసింపవలసియున్నది. ఇందలివర్ణనలు నాతిదీర్ఘములుగాక యేరసము వచ్చినపట్ల నారస మొలికింపుచుఁ బండితపామరుల కందఱకు నమితానంద మొనఁగూర్చుచున్నయవి. చిన్నక్షరములలో 150 పేజీలుగల యొకపాటిగ్రంథము వెల 0-12-0 లు.

కర్పూరతిలక:—ఇదియును బైవారిచేతనే రచింపఁబడిన యొక నాటకము. ఇందలికథ యుదయపుర రాజునకు జ్యోతిపుర రాజునకు సంబంధించినదై యున్నది కావున నిదియుఁ జరిత్రజిజ్ఞాసుల కాదరణీయమైన యదియే. వీరికవిత్వశైలి యిదివఱకే తెలుపఁబడియుండెను గావున మరల ననవసరము. అయిన నీగ్రంథము ప్రథమోద్యమమగుటఁ బైగ్రంథమందలి రసము మాత్రము దిగినది కాదు. గ్రంథకర్తకు శాస్త్రజన్యజ్ఞాన మించుక తక్కువగుటఁ గాబోలు నీగ్రంథద్వితయమందును ధర్మిధర్మములు మాత్రము కొన్నిచోట్ల సరిగాఁ బడియుండినవి కావు. గౌరవనీయాదిపదప్రయోగము నిట్టిది. ఇంతియే కాని తక్కినవిషయములలో వీరిగ్రంథములు విద్వత్కవుల గ్రంథములకుఁ దీసిపోవునవి కావు. ఎంత విద్వత్కవులైనను గ్రంథము రసాశ్రయమగుటమాత్రము సుకృతైక

లభ్యముగాని ప్రయత్నసాధ్యముకాదు. వీరురచించిన నవలలు మఱికొన్ని యముద్రితములుకూడ నున్నయవి. మాపత్రిక కొకనవల నీయ వాగ్దానముచేసియుండిరి కావున( గొలదికాలములో నయ్యది ప్రచురింపఁబడఁగలదు. దీనివెల 0-8-0 లు. ఈరెండుగ్రంథములును వలయువారు గ్రంథకర్తకుఁగాని రాజమండ్రిలోని R. S. ప్రకాశరావు అండుకంపెనివారిపేరఁగాని వ్రాసి తెప్పించుకొనవచ్చును.

మందారమంజరి:—ఇది దూపాటి తిరుమల వెంకటరమణకవుల చే రచింపఁబడిన యొకచిన్నపొత్తము. పద్యమయముగనున్నను శైలి మాత్ర మిప్పటి నవలలననుసరించియున్నయది. కవిత్వము హృద్యమై ప్రౌఢపాకముగలదిగా నున్నది గ్రంథకర్త లిది ప్రథమప్రయత్నమని వ్రాసికొన్నను గ్రంథము ప్రౌఢముగానే కనుపట్టుచున్నది. ప్రథమప్రయత్నమన్నందులకు రేఫసంయుక్తపూర్వాక్షరముల నూదిపలుకుట లోనగు కొందఱుతఱచుగాఁ బ్రయోగించుచునేయుండిన యొకటిరెండు స్వల్పదోషములుదప్ప నొండులోపము లేవియుఁ గానరావు వీరి తరువాతిగ్రంథములు మఱింత రమణీయములై యుంటను సందియముండదు. కనుకనే యేతత్కృతమగు వెంకటేశ్వరవిలాసమును గొలఁదికాలము లో మాపత్రిక ప్రకటించుభాగ్యము నందఁగలదు.

ఓరియెంటలులైబ్రరి లోని లిఖితగ్రంథసూచీపత్రము—ఇందు లైబ్రరీవారు 1910 వ సంవత్సరము మొదలుకొని 13 వ సంవత్సరము వఱకు సంపాదించిన ప్రాచీనాంధ్రగ్రంథములవిశేషములు తెలుపఁబడి యున్నవి. విషయవివరణము కడుఁజక్కఁగాఁ జేయఁబడి యుండుటయే కాక తత్తద్గ్రంథప్రేషకుల నామములుకూడఁ బ్రచురించి వారికీర్తి వెల్లడిచేయఁబడియున్నది. కావున ముద్రితములుగాని యముద్రితములు గాని మనపూర్వులుచేసిన మనయిండ్లలోని తాళపత్రగ్రంథములు చిమటలవాతంబెట్టుటకంటె లైబ్రరికర్పించి యశోవంతులగుట యెల్లర కవశ్యకర్తవ్యము. అముద్రితములవిషయమై గవర్నమెంటువారుతీసికొనెడిశ్రద్ధ యెంతయో లోకోపకారకమనుట కిసుమంతయు సంశయము లేదు. దీనివెల 1-6-0 లు. వలయువారు మదరాసు ఓరియంటల్ లైబ్రరీకి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

(బ్రహ్మశ్రీ రామడుగు సుబ్రహ్మణ్యహరిదాసుగారి లో
కాంతరప్రాప్తిం గుఱించి)

ఉ॥ ఇమ్మగ సజ్జనస్తుతుల నెన్నియొ కాంచి నిరంతరాన్నదా
నమ్ములఁ బ్రాణముల్ విసువునంబడనీయక యన్యవృత్తి నే
వమ్మగఁజూచు రామడుగువంశపవిత్రుని సుబ్బయార్యు జీ
వమ్ములఁ బాపి నీ బ్రతుకు వ్యర్థముచేసితి వేమి? మృత్యువా!॥ 1

ఉ॥ చిన్నతనమ్మునుండియును జేయఁగరాని మహాపచారముల్
గ్రన్ననఁ జేయునట్టి యల కాపురుషుల్ మితిలేక కల్గ నీ
కన్నులఁ జెట్లు మెచ్చినవె? కల్మషదూరు నిరంతరాన్నదా
నోన్నతిమీరు సుబ్బయబుధోత్తము మ్రింగితి హా కుటుక్కునన్॥ 2

ఉ॥ చంద్రుఁడు వ్రాలె వెన్నెలకుఁ జక్కని కీర్తికి నాలవాలమై
ఇంద్రమహీరుహంబునకు నెన్నియొ వంకలు పెట్టిపెట్టి పం
చేంద్రియవృత్తి దుర్మదమునంతయుఁ బేరణగించు నీదయా
సాంద్రుని సుబ్బయార్యజనుఁ జంపఁగ నీమన సెట్టులోర్చెనో॥ 3

చ॥ సతిసుతులార్వ బంధుగులసంఘము దుఃఖముఁ జెంద నన్నయున్
మతి వెతఁ జెంద నీసుజనమాన్యుని శిష్యులు బల్ దిగుల్గొనన్
ధృతివిడియున్న దాతృతయు దేశము పాలయిపోవ నీకు నీ
మతి దయ లేదె? యీయనఘు మార్కొనుదే? మృతి! తామసాకృతీ!॥

సీ॥ కడఁగి ముక్కోటియేకాదశి మృష్టాన్న
దానంబుచేఁ బవిత్రమగు టెట్లు?
బాటసారులను సాపాట్లఁ దన్పించుచో
శివరాత్రి యింకఁ బుష్టిగను టెట్లు?
క్షుద్బాధ కెండలో సొక్కి వేతెంచు న

భ్యాగతుల్ సంతోషపడుటఁ కెట్లు
బ్రహ్మసత్రాద్యుత్సవమ్ములో నెడ నెరుల్
గార్యనిర్వాహణముం గనుటఁ కెట్లు
పరమభాగవతోత్తమవ్రజము ముదము
పొదల నేతాదృశుని హితుం బొందు టెట్లు
ధరణికింగల సౌఖ్యసందర్భములను
పాడుసేసితివో మృత్యువా! నిజంబు 5

చ॥ విమలపురాణసంచయము వేదములుఁ గడు ఘోరమైన నీ
మములును దేనిదివ్యమహిమంబును గాంచఁగలేవొ పుణ్యగ
ణ్యమయిన యన్నదాతృత ననాథను జేసితి వింక నెట్టు లు
త్తమగుణవస్తువిత్త్వమది తప్పక కల్గును నీకు మృత్యువా! 6

చ॥ క్షితి నిరతాన్నదాతయను కీర్తివెన్నెల నోలలాడి స
ద్గతి నటుచేతిలో నిలుపఁగాఁజనె నయ్యనఘుండు దానికై
వెతగనరాదు కాని యిటు వీరల కేమరణంబు గూర్చి స
త్కృతులనణంచు బ్రహ్మబ్రతుకే పొడవాటకు నేడ్వఁగావలెన్ 7

ఉ॥ కోడికి రత్నమెట్టు లటు గోచరమయ్యెనె నీమనస్సుకీ
బాడబవద్యుఁ డక్కట ప్రభాప్రథితాఖిలదిగ్వధూటికా
ప్రేడితకీర్తికాముఁడు సమీపగతాఖిలదుష్కృతాటవీ
బాడబవిస్ఫులింగకణవల్లభమూర్తి మృతీ! ఖలాకృతీ! 8

క॥ ఏలా నిల్పెదు సజ్జన। లీలాకల్పకఫలావళిని భువి నంహో
జాలప్రథాధిగతకలి। కాలాభీలోగ్రశిఖి జగంబులు బ్రుంగన్

మ॥ అనఘుండై శ్రమలెన్ని యోసయిచి నిత్యాన్నప్రదానంబులన్
దనివింజెందని సుబ్బయాఖ్యుని దనుత్యక్తుంబొనర్పంగ నీ

మనసట్లోర్చనెకాని యవ్విధిసి బ్రహ్మస్తోమముందన్పఁగా
నినుఁబుట్టించిన బ్రహ్మకైనఁదరమే నిర్నిద్రసత్వప్రథన్ 9
శా॥ నిన్నుం జంపఁగ శక్తుఁడయ్యె వినుమా నిష్కల్మషుం డింద్రలో
కౌన్నత్యంబులఁ గల్పవృక్షకృతదానౌన్నత్యసందర్భముల్
కన్నాఱంగనవేగఁగాక తరమే కష్టాత్మ తత్పుణ్యసం
పన్నున్ సుబ్బయగారిఁజంపుటనఁగాఁ బాపీ! నినుంబోల్పకున్ 10
సీ॥ కల్పవృక్షమునోట గడ్డగొట్టెనుగదా
ముఖ్యదానోద్రేకమున్ భరించి
శరదిందుచంద్రికన్ సమయఁజేసెనుగదా
స్వాయశఃప్రకాశవిభ్రమము నెఱపి
ప్రహ్లాదు దైతేయపతినోనర్చెనుగదా
హరిపదాంబుజయుగస్మరణఁజేసి
మొగురఁజేసెనుగదా యింద్రు నుప్పరవీథిఁ
క్రతుశతదుష్కృతచ్యుతిఁ దనర్చి
చతురతము శాంతనవు బ్రహ్మచారిజేసె
సరసగుణధైర్య గాంభీర్యసాహసముల
నతఁడు కేవలమానవుండనుచు నెంచి
చంపఁబోయితివే మృతి! తెంపుఁజేసి 11
మ॥ నినుబుట్టించెను బ్రహ్మ లోకవితతిన్ నిర్మూలనంబాచరిం
పన కానీ యగుఁగాక నెమ్మనమునన్ మంచిం జెడం గానలే
ని నినుం బ్రాజ్ఞులుమెత్తురే? కరుణయున్నిమో మిఁకంజూచునే
వినువారెల్లరు నవ్వరే చెడుమృతీ! విశ్వాసశూన్యాకృతీ 12
సీ॥ అనుజన్మశోకాబ్ధిమునిఁగి వెంకయశాస్త్రి

లకట చెప్పనెపార మనెడివారు
ఒకవేళ వారట్టలోర్చిన నిరశనం
బున విద్యనేర్చుటె ల్లనెడివారు
తండ్రినే మఱపించు దాక్షిణ్యనిధిఁ జంపె
నకట పాతకిదైవ మనెడివారు
ఇటు విద్యఁజెప్ప నిష్కుటిలాత్మ నింకనెం
దునఁజూడఁగానగు ననెడివారు
అమితమైత్ర్యబ్ధినుంచి ఘోరాటవులను
దోలెనమ్మని దైవముందూరువారు
మతులవిద్యార్థిజనులు దుఃఖితులుగాఁగఁ
బాపిమృత్యువ!మనసునీకోపె నేఁల్లు 13

మ॥ విమలోదగ్రసురార్చనావళుల నావిర్భావముంజేసి పు
ణ్యము నాయూరనె కట్టివై చె,జనవంద్యప్రాపితోచైచర్యశో
స్సుమనోవల్లిక లేతఁలేతఁవగు మోసుల్గూర్చె,నాజ్ఞానర
త్నము నేపార్చితి,లోకనిందలకుఁ బాత్రంబైతి వోదుర్మృతీ 14

శా॥ అమ్మా! సుబ్బయకీర్తికాంత!విను,విద్యార్థుల్ తముంగూర్చి హ
ర్షమ్మొందంగ నతం"డహాకొనురులారా!మీరలే నన్ను స్వ
ర్గమ్మెక్కించెడిమెట్లుసు"మ్మనినవాక్యమ్మెంచి దుఃఖించి లా
భమ్మంగాంచిరె?నీవు నేను నటులే వ్యర్థమ్మెఁకెం తేడ్చినన్ 15

చ॥ మనమిపుడెవ్విధిం దప మమందతఁజేసినఁ జూడఁబోమిఁకా
తనువును దత్ప్రవర్తనము,దానికిమాఱుగనీవునిల్చి య
య్యనఘుస్మరింపఁజేయుము మదాదులఁబంచమహాగ్రపాతకేం
ధనదవవిస్ఫులింగకణదారుణమూర్తి!సుకీర్తికామినీ 16

మ॥ అనఘా! సుబ్బయసూరి! నీకొఱకిఁ కెంతల్లాడినన్ నీదుద
ర్శనముంగాంచఁగలారమే? కటకటా! బ్రహ్మాదిగీర్వాణులె
ల్లనుసాధింపఁగలేని మోక్షమవలీలంజూరఁగొన్నాఁడవం
దనిపండద్ది త్వదన్యసంతతికి నిత్యంబయ్యెడున్ నీకిఁకన్ 19

ఇట్లు- తెలికెపల్లి రామచంద్రయ్య

చదువరులారా!

పైపద్యములఁ బేర్కొనఁబడిన పురుషు నివాసము నరసరావుపే
టతాలూకా నాదెండ్ల,వీ రిరువు రన్నదమ్ములు, అగ్రజులు వెంకయ్య
శాస్త్రిలవారు, వారమోఘసాహితీధురంధరులై యనేకవిద్యార్థుల నా
త్మజులంబోలెఁజూచుచుఁ బఠింపించిన మహోదారులు,మధ్యదేశమునఁ
గావ్యపాఠములు చెప్పుటలో వీరికున్న యశము మఱొక్కరికి లేదు,వీరివద్ద
బుస్తకముఁబట్టినవార లనేకులు పండితులై యశముగడించియలరు
చుండుట ప్రత్యక్షము, అన్నదానములకుఁగూడ నయ్యనఘుఁడే కొంతవఱ
కాచార్యుఁడు, ఇఁక ననుజులగు సుబ్బయ్యగా రిప్పటికి ముప్పదివత్సరము
లనుండి తమ యఖిలప్రయత్నములును నన్నదానమునకే వినియోగించు
చుండిన పుణ్యపురుషుఁడు, ప్రప్రథమమున సప్తాహబ్రహ్మసత్రాదిసత్కార్య
ముల మనమధ్యదేశమున కవతరింపఁజేసిన వాఁడే యాయన, సప్తాహ
బ్రహ్మసత్రరామయజ్ఞాదులచే ననేకలక్షలప్రజల కన్నదానముచేసి
యందుచేఁ దనివిసనక పదివత్సరములనుండి పరస్థానికులకు నిత్యాన్న
సత్రమే సాఁగించుచున్న మహామహుఁడు, ఏటేటఁదన్మార్గమున శివరా
త్రికిఁగోటప్పకొండకేగెడి సర్వవర్ణజనులకును జాలినంతయన్నదానము
చేసియు ముక్కోటిమొదలగు పెక్కుపర్వములయం దుచితసత్కార
పూర్వకముగనోపినంత భూతతృప్తిం జరిపియు నుత్తమోత్తమతఁగన్న

మహాకీర్తిశాలి, ఆయూరఁ బెద్ద సత్రమొకటినిర్మించి తనయనంతరముకూడ దాన నవిచ్ఛిన్నముగ నన్నదానముజరుగుటకై తగినంతభూమినార్జించి తత్సత్రముపేరనే పట్టాచేయించియుంచిన పుణ్యశాలి, పలుమందివిద్యార్థులాసత్రమున నిష్టాన్నసంతృప్తులై శాస్త్రులవారివద్ద విద్యనేర్చుకొనుచుఁ దద్గ్రామం బలంకరించియుందురు. విద్యాదానమునకంటే వేఱొకపని వెంకయ్యశాస్త్రులవారికిని నన్నదానముకంటే నన్యమైనపని సుబ్బయ్యగారికిని లేదని ముమ్మాటికిం జెప్పనొప్పు. అట్టిసుబ్బయ్యగారికిఁగలిగిన యకాలమరణమునకై యనేకు లపారదుఃఖ మనుభవించుచున్నమాట నిజము. అందులో నేనొకఁడను. దుఃఖించిచేయునది యేమిలేకయున్నను మాయాంధకారమగ్నమై మానవకోటి యది మాననేరకయున్నది. కాని హరిభజనము, అన్నదానపరత మొదలగు నాయనసద్గుణముల నంతికమునఁజేర్చుకొని యలభ్యవస్తువగు నాయనమీఁదిచింత యాపికొనుట యవశ్యకర్తవ్యము.

పత్రికాధిపతి.

పంచాననబహూకరణము.

పాఠకమహాశయులారా!

తిరుపతివెంకటేశ్వరకవులకును గొప్పరపుసోదరకవులకును గలిగిన వివాదములో మన మొకపక్షమునఁ జరించినవారమే? అభిమానమున్నపుడు గుణదోషచర్చ మం మొనరింపఁజాలక వంచనాచంచుపులును వందిసముఖులు నగు విరుద్ధమనస్కుల దురభిప్రాయరజ్జువుచే బంధీకృతులమై మనకుఁ బరమాత్ముఁడొసంగిన యుక్తాయుక్తచర్చయను జ్ఞాననేత్రమునఁ బక్షపాతమను గురిగింజపప్పు చాదివెట్టుచున్నారము. ఇదిగొప్పలోపము. సమానులకో యసమానులకో కొండొక వాగ్వాదము

కలిగినపుడు భాషాసేవకులమగు మన మొనరింపవలసినకర్జ మేదియన నిరుతెగలవారలకు నైకమత్యమొనరింపఁ బాటుసేయుటయే. కొందఱీవిషయమునసల్పుదురుద్యమములు మనస్తాపములుకలిగించుచున్నవి. విద్యావాదమునందుఁ దమప్రతిపక్షులఁ దామోడింతురో యోడుదురో క్రమముగఁ జూడనున్న మనము శాఖాభిమానమో బంధుప్రీతియొ యాంతరంగికస్నేహసంబంధమొ బలపఱచుకొని గంతులువేసి వారివీరిఁ బడదిట్టినచో మనయపకీర్తి యాచంద్రార్కస్థాయి కాఁగలదు. సమ్ముఖమున రాయబారమేల? ఈవ్యాసము పండితకవిదూషకులగు వృథాభిమానుల గుఱించియే వ్రాయఁబడినది. వారెవరందురా? ఎవరో కారు. కొండొకయతిప్రాసలఁ గూర్ప నేర్చి ముందుగఁబొగడిన నాలుకతోనే దూషించు దుర్విదగ్ధులు. వారే తిరుపతివెంకటేశ్వరులకుఁ దిట్లఁ గానుకగాఁ బూర్వము దర్బారుముఖమునఁబంపి నేఁటికి హితకారిణియం దలంకరించిపంపువారు. ఈహితకారిణిని బ్రకృతి మలంకరించి యవ్యక్తవ్యాసము లవ్రాసి ధీరమనస్తాపముల నొనగూర్చు విద్యాగంధశూన్యుల కఠినముగమందలించువా రొక్కఁడుం గానరారు. వీరికి సద్బుద్ధికలుగుత్రోవయుఁ గానరాదు. శ్రీకృష్ణరాయలకుఁ దీసిపోనిరాజన్యుఁడిపుడొకఁడుండి యాతఁడే మనయాంధ్రరాజ్యాధినాథుఁడై పక్షపాతవిదూరుఁడై యున్న నిహము పరముదలంపక ప్రేలుపండితమ్మన్యులకు బుద్ధిరాకమానదు. అట్టియదృష్టము లేదు. ముందుపట్టదు. ఈవాచాటులనోరులు మూఁతపడవు. తుదకు యల్లయ్యమల్లయపేరుల (వరవడి) వ్రాసికొనువారు మహాపండితులవలె శ్రీరంగనీతులుబోధించుకాలము తటస్థించినది. వీరందఱు పోతులూరివీరబ్రహ్మముగారి మతానుచరుల భవిష్యదుక్తుల నిర్వహింపజన్మించిరోటు

ఈవిషయమై జ్ఞానవంతుఁడగువాఁడు తనయభిప్రాయ మెఱింగింపఁబూనెనేని వానివ్రాఁతలు గ్రంథము కాక మానదు. బుద్ధియాందోళనాపరవశము కాకపోదు. కలము గుంటువడక మానను ఇంతకు ముఖ్యహేతు వెద్దియన నతఁడు(లేఖకుఁడు)మృషావాదికాకపోవుటచేతనే. కాలస్వభావము కడువిరుద్ధమైనదికాన నీవివాదపర్యవసానముగూడ విరుద్ధముగఁ బరిణమింపనున్నది. దానికేమి? అదిసహజమెకాని యీమధ్యదలలెత్తి "శిష్యుఁడుర్ దాండనమూడ నాఁడవెపిశాచీభూతభేతాళముల్" అన్నట్లు వృద్ధాభిమానులుచేయుదుండగములె పదింపదిగ నతిశయించుచున్నవి దుండగఁపులేకరులకు బుద్ధిచెప్పవలసినత్రోవ దుండగపువ్రాఁతలోడనే గాని యుల్లోనరింప సహృదయు లొప్పికొనరు. సత్కవులవాక్కులు శాశ్వతముగ నిలకొనినటుల వదరుపోతుల ప్రల్లదములు స్థిరత్వమునూనక నశించుఁగాన నావిషయమై యంతర్వాణు లంతగాఁ బొటువడనవసరము లేదు. దుర్దినమాహాత్మ్యమునఁ బయోదములచే లోకబాంధవుఁడు కప్పఁబడినను నతని ప్రకృతిజన్య తేజోలవంబున కీషల్లోపమేని సంఘటింపఁజాలదు. ఎవరో "పాతగోడకు పూతచక్కన" యను శీర్షికతో హితకారిణిలో నొకకొంత యీర్ష్యాజన్య విరుద్ధోక్తులతో రోజుచు బ్రహ్మశ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారిని దిరుపతి వేంకటేశ్వరకవులను విశేషించిదూషించియున్నారు. ఇం దించుక గ్రంథవిమర్శముగూడఁ గలదు. ఫలమేమి? పేడకుప్పలోనిపూవులు గంధమును వెదలఁజేయునటుల నీగ్రామ్యవాదశీలుని దురుక్తులచే విమర్శ యంతరాయ మొందుచున్నది. దురభిమానులు లేపనిసేయలేరు? లోకమును గన్నుమూయఁగలరు. కుక్కను గంగిగోవనఁగలరు.

(సశేషము.)

శ్లో॥ అసారేసంసారే నిజభజనదూరే జడధియా
భ్రమంతం మామంధం పరమ కృపయా పాతుముచితం
మదన్యఃకోదీన స్తవ కృపణరక్షాతినిపుణః
త్వదన్యః కోవామే త్రిజగతి శరణ్యః పశుపతే!
ఉ॥ సారవిహీనసంసృతిని సంతతముం జరియించునంధు నన్
గూరిమి నేలు టెంతయునుగూడును, దీనుఁడ నేను దప్ప నె
వ్వారలునీకురక్ష్యులిల, వాస్తవమియ్యది, నాకుఁగూడ నిం
కేరుగలారురక్షకు లహీనవిభూష త్వదన్యు లిద్ధరన్ 13
శ్లో॥ ప్రభుస్త్వందీనానాంఖలు పరమబంధుః పశుపతే!
ప్రముఖ్యోహం తేషామపి కిముత బంధుత్వమనయోః
త్వయైవక్షంతవ్యా శ్శివ! మదపరాధాశ్చ సకలాః
ప్రయత్నాత్కర్తవ్యం మదవన మియం బంధుసరణిః
ఉ॥ ధారుణి దీనబంధుఁడ వుదారమహాప్రభువీవు, నేనుర
క్షారహితుండ, దీనుఁడను, గావున నాదొసఁగుల్ క్షమింపఁగన్
భారము నీకయున్న యది, బాంధవకృత్యము సార్థకంబుగాఁ
గూరిమినన్ను బ్రోవఁదగు, కుండలిభూషణ! సాధుపోషణా! 14
శ్లో॥ ఉపేక్షానోచేత్కిన్న హరసిభవద్ధ్యానవిముఖాం
దురాశాభూయిష్ఠాం విధిలిపిమశక్తోయదిభవాన్
శిరస్తద్వైధాత్రం ననఖలుసువృత్తం పశుపతే!
కథంవానిర్యత్నం కరనఖముఖేనైవ లులితం
మ॥ ననురక్షింప నుపేక్ష లేనియెడలం ద్వద్ధ్యానవైముఖ్యమున్
గని దుష్టాశలనున్న బ్రహ్మలిపియంతన్ మాపఁగంజూడు, మీ
పనికింజాలనటందువేని యెటులన్ వైధాత్రశీర్షంబు హ
స్తనఖాగ్రంబునగిల్లివేసితివిమున్ జండీశ హేలాగతిన్ 15
శ్లో॥ విరించిర్దీర్ఘాయుర్భవతు, భవతా తత్పరశిర
శ్చతుష్కం సంరక్ష్యంసఖలుభువి దైన్యంలిఖితవాన్

విచారఃకోవా మాం విశద కృపయాపాతి శివ! తే
కటాక్షవ్యాపార స్స్వయమపిచ దీనావనపరః

ఉ॥ ధాతచిరాయువౌత శివ!తత్పరశీర్షచతుష్టయంబు నీ
చేతసురక్షితంబగుట శ్రేష్ఠ,ముతెంపులిఖించెదీనతన్
బ్రీతినిమల్లలాటమున,భీతియుఁ కెందుకునాకు,దీనర
క్షాతురమైన నీదుగరుణార్ద్రపుదృష్టియె నన్నుఁబ్రోచెడిన్ 16

శ్లో॥ ఫలాద్వాపుణ్యానాం మయికరుణయావా త్వయివిభో!
ప్రసన్నేపిస్వామిన్! భవదమలపాదాబ్జయుగళం
కథంపశ్యేయం మాం స్థగయతి నమస్సంభ్రమజుషాం
నిలింపానాంశ్రేణి ర్నిజకనకమాణిక్యమకుటైః

ఉ॥ మామకపూర్వపుణ్యఫలమాన్యతనుండిరొ నీకు పూర్ణమా
ప్రేమపుదృష్టినుండిరొ లభించెనుగాని త్వదీయదర్శనం,
జేమగుదాన,నీయనుఁగులెంతయుఁగన్పడనవ్వ వందమా
నామరసత్కిరీటనివహంబులమాటుననుండి,ధూర్జటీ! 17

శ్లో॥ త్వమేకోలోకానాంపరమ!ఫలదో,దివ్యపదవీం
వహంత స్త్వన్మూలాం పునరపిభజంతే హరిముఖాః
కియద్వాదాక్షిణ్యం తవ శివ!మదాశాచకియతీ
కదా వామద్రక్షాంవహసి కరుణాపూరితదృశా

శా॥ భావింపంగజగాలకు త్తమఫలప్రాప్తుల్ ప్రసంగింపఁగా
నీవొక్కండవె,కాంచి కేశవముఖుల్ నినుండి సుస్థానముల్
సేవల్ సేయరె? తావకీనమగు దాక్షిణ్యం బహో!యెంతదో
దేవా!నన్నెపుడేల్లుచూచెదు భవద్దివ్యత్కృపాదృష్టులన్ 18

శ్లో॥ దురాశాభూయిష్ఠే దురధిపగృహద్వారఘటకే
దురంతేసంసారే దురితనిలయే దుఃఖజనకే
మదాయాసంకిం న వ్యపనయసి కస్యోపకృతయే
వదేయం ప్రీతి శ్చేత్తవ కృతార్థాఃఖలువయం

చ॥ సకలదురాశలంబొరలి సార్థకహీనన్నృపాంగణాల నెం
తొకుటులవృత్తిమైఁదిరిగి దుష్కృతసంసరణానురక్తిచేఁ
బ్రకటితమైనమద్భ్రమముఁ బాపవదేమి?విరించిబ్రాఁత త
ప్పకయొనరింపనా?కరుణవచ్చినఁ గల్గుగమత్కృతార్థతల్ 19

శ్లో॥ సదా మోహాటవ్యాంచరతి,యువతీనాంకుచగిరౌ
నట,త్యాశాశాఖాస్వటతి,ఝుటితి స్వైరమభితః
కపాలిన్!భిక్షో!మే హృదయకపిమత్యంతచపలం
దృఢంభక్త్యాబధ్వా శివ!భవదధీనంకురు విభో!

మ॥ పటుమోహాటవిసంచరించు, నెగురున్ భామాకుచాద్రిస్థలిన్
గుటిలాశాతరుశాఖలెక్కి దుముకుం గ్రూరంబుగం దా మదో
త్కటమన్మానసవానరాధమ మిటుల్,త్వద్భక్తిపాశంబుచేఁ
బటుబంధంబొనరించి నీవశమునం బాలింపు గౌరీపతీ 20

శ్లో॥ ధృతిస్తంభాధారాం దృఢగుణనిబద్ధాం సగమనాం
విచిత్రాం పద్మాఢ్యాం ప్రతిదివససన్మార్గఘటితాం
స్మరారే!మచ్చేతస్స్ఫుటపటకుటీం ప్రాప్య విశదాం
జయ స్వామిన్! శక్త్యాసహ గణైస్సేవిత విభో!

చ॥ ధృతియనుకంబమెత్తుఁబడి తిన్నఁగఁగట్లు గుణాళిచే వి
చిత్రతఁ గమలాఢ్యమౌచు గతిదాలిచి సత్పథదీప్యమానమౌ
నతులితమన్మనఃపటగృహంబున భూధరపుత్రితోడుగాఁ
గుతుకమునన్ వసింపుమిఁక గోపతివాహన! ఫాలలోచనా! 21

శ్లో॥ ప్రలోభాద్యైరర్థాహరణపరతంత్రో ధనిగృహే
ప్రవేశోద్యుక్తస్సన్ భ్రమతి బహుధా తస్కరపతే!
ఇమంచేతశ్చోరం కథమిహసహే శంకర! విభో!
తవాధీనంకృత్వా మయి నిరపరాధే కురుకృపాం

ఉ॥ భూమి ధనాఢ్యగేహములపొంత ధనాపహృతింబొనర్పనై
వేమఱుసంచరించుచును విశ్రుతలోభగుణప్రవీణుఁడౌ

మామకచిత్తతస్కరుని మాంద్యము నెట్లుసహింతుఁ దస్కర
స్వామి!భవద్వశుఁ సలిపి వర్తిలఁజేయుము శాదుపైఁగృపన్ 22

శ్లో॥ కరోమిత్వత్పూజాం సపదిసుఖదో మే భవ విభో!
విధిత్వం విష్ణుత్వం దిశసిఖలు తస్యాఃఫలమితి
పునశ్చత్వాంద్రష్టుం దివిభువివహన్ పక్షిమృగతా
మదృష్ట్వాతత్ఖేదం కథమిహసహే శంకరవిభో!

మ॥ శివ! నీపూజయొనర్తు,నచ్యుతపదశ్రేయంబునాకిమ్ము గీ
ర్ధవగోవిందులు మున్ను నిన్గన ఖగేంద్రక్రోడరూపంబులన్
దివి భూమిం బరికించి కానక మహాదీనాత్ములైరట్టిదుః
ఖవిశేషంబునకోర్వఁ,జేయకుమునన్ గంసారిగన్ బ్రహ్మగన్ 23

శ్లో॥ కదావాకైలాసే కనకమణిసౌధే సహగణైః
వసన్ శంభోరగ్రే స్ఫుటఘటితమూర్ధాంజలిపుటః
"విభో! సాంబ!స్వామిన్!పరమ!శివ పాహీ"తినిగదన్
విధాతౄణాంకల్పాన్ క్షణమివ వినేష్యామి సుఖతః

శా॥ శ్రీకైలాసమునందు రత్నకనకశ్రీసౌధమధ్యంబునన్
జేరన్ భక్తగణాంబికాయుతశివాస్తోకాగ్రభాగంబునన్
వీఁకం దోసిలి మూర్ధమందిడి"భవానినాథ!నన్నేలు"మం
చాకంజోద్భవు కల్పముల్ నిమిషమైన ల్లెప్పువెళ్ళింతునో 24

శ్లో॥ స్తవైర్బ్రహ్మాదీనాం జయజయవచోభి ర్నియమినాం
గణానాం కేళీభి ర్మదకలమహోక్షస్యకకుది
స్థితం నీలగ్రీవం త్రిణయన ముమాశ్లిష్టవపుషం
కదాత్వాంపశ్యేయం కరధృతమృగం ఖండపరశుం

మ॥ శ్రుతివాక్యంబుల బ్రహ్మముఖ్యులు జయస్తోత్రంబులన్ దాపసుల్
హితలీలాగతిఁ గింకరుల్ మెలఁగ నుక్షేంద్రంబుపైనెక్కి యా
సతితోఁగూడిననీలకంధరు నినున్ సారంగపాణిన్ విశా
లతరేంద్వగ్నివిభాకరాక్షుని విలీలం జూచు చెప్పుందునో 25

క॥ ఆదికారణముగ నాతనిఁ
గదిసి రహస్యముగ నేను "గమసాలెలక
న్న దొరకకుండిరె, నీవి
య్యాదియొప్పితె బ్రాహ్మణుండవయ్యు" నటన్నన్ 59
తే॥ "క్షుద్రజాతులు చనుదెంచి రౌద్రముగను
జేయుచుండెడి పశుహింసచేఁ జెలంగు
గ్రామదేవతతో మన కేమికార్య
మద్ది నీచులు పోయెడిమాలయంబు 60
చ॥ కనుకను నెవ్వఁడేని సలుపుఁగాక, తదిష్టము, వాండ్రగోలతో
మనకిపుడేల" యంచుఁ గడుమంచిగ నుత్తరముల్ వచించినన్
మనమున నేదితోఁప కటు మౌనము దాల్చితి, నిన్ని హేతువుల్
కనఁబడు నప్డు "కూడ" దని ఖండితవాదము చేయకుంటకున్ 61
తే॥ అంతఁ దప్పించుకొని యెట్లొ యచ్చోటునుండి
యివలఁబడఁగల్గియొక్కింత యెడకు, నాదు
భ్రాతకును మఱికొందఱు బ్రాహ్మణులకుఁ
జెప్పితిని జూచివచ్చిన చిత్రమెల్ల 62
ఉ॥ భ్రాత వచించె నంతటను బాగుగఁ జర్చయొనర్చి తెల్పుచున్
"నీతయ నమ్రభావమునఁ జేతులు మోడ్చి వచించినంతనే
యాతని మాట నమ్మితివి, యయ్యది పోలునె? గ్రామదేవతల్
మాతలు కాదె యెల్లరకు, మాన్యలుగారొకో బ్రాహ్మణాళికిన్ 63
క॥ కొలుపులలోపల బ్రాహ్మణు
లల పోలేరమ్మగుడికి నరిగి సపర్యల్
సలుపుచునుండుట తెలియఁగ వె
కులహీనులె కొలుతురనుటకున్ భ్రమియంగన్ 64
చ॥ నిశిసమయంబునం జరుగు నీచపుఛాగవధాదికంబు, లా
పశువధతోడ నేమిపని బ్రాహ్మణజాతికి, వార లేగుచో
విశదముగా నెయుండు, నవి వేకువె మామకు లాదినుండి యీ
దృశమగు పూజనంబునకు దేవతసన్నిధి కేగుచుంటకున్ ౬

చ॥ కడఁగినదిట్టి మున్కృతికిఁ గమ్మమహాప్రజ, వారికిం దగన్
నుడువఁగ లేక త్రొక్కిరిటు నూతనపద్ధతి, తానెముందుగా
బుడిబుడిఁ గొంచుఁబోవఁడొకో పూర్వమునందు బజంత్రిమేళపుం
గడబిడతోడఁ బోనమును, గాదని సీతయ యిట్లు చెప్పఁగన్ 66

చ॥ "వల"దని చెప్పిచూత,మది వార్వినిరేని గడుమంచిదే యగున్
దెలిపిన మీఁదఁ గూడఁ దమ ద్వేషము నీవిధిఁ దీర్చికొంటరున్
దలఁచి వినూత్నయంత్రముల స్థాపన బత్తుని చేతనే యటుల్
సలుపఁగఁ జేసినం గుడులచక్కికిఁ బోవుట మానికోఁదగున్ 67

చ॥ కొలువులు రేపె, బోనములు కొంచుఁ జనంగ మదిందలంపనే
నలుకుచు ముగ్గులున్ సహితమస్మదగారమునందుఁ జేయ, మీ
పలుకులు నచ్చినన్ నిలుఁడు బ్రాహ్మణులందఱు, నచ్చకుండినన్
వలసినరీతిగం జనఁగవచ్చును, నామతమిద్ది రూఢిగన్" 68

ఆ॥ ఖండితముగ నిట్లు కావించు మాయన్న
యాప్రసంగ మందఱాలకించి
సంశయములు వీడి చననయ్యె నిండ్లకుఁ
దాము నిట్లు చేయఁదలచి మదిని 69

ఉ॥ ఒప్పిపదింటికే యచట నుత్తరపుంగ్రియచూచికొంచు నా
గొప్పకలాదుఁ డుండుటయుఁ గూడిరి రాత్రికి బ్రహ్మమాది మా
యప్పలుకొంతమంది,యపు డాయన యెవ్వియొ కొన్ని ముచ్చటల్
చెప్పుచుఁ గూరుచుండుతఱి చేసిరి వారొక ప్రశ్న మాతనిన్ 70

క॥ "ముందఱ మీర్చేసెడిపని
యందమదెట్టిదియొ వినఁగ నభిమతమయ్యెన్
సందియముందక చెప్పుఁడ
మందానందంబు గలుగ మాకందఱకున్" 71

ఉ॥ ఈవిధిఁ జేయు ప్రశ్నమున కిట్టుల నాతఁడిడెంజవాబు దా
నావల, "యంత్రముల్ సలిపి యయ్యవి స్థాపనచేయు మాత్రమే
నావిధియంతకెక్కువగ నాకేదియుం దెలియంగరాదు,మీ
భావమదేమొ,యెందుకని ప్రశ్నముఁ జేసితిరో వచింపుఁడీ" 72

చ॥ అనుటయు వారలిట్లనిరి,"యయ్యది చాలమకీర్తి రాకకున్
మనకుల మెట్లొ వృద్ధియగుమార్గమొకండుతటస్థమయ్యెఁ,గా
వున మన మిప్డె పోవలయుఁ బోయెడిపోకడయెల్ల,నందుకై
యొనరుప నాఁ బ్రతిష్ఠయును,నొప్పుఁడు మీరలుకూడదానికిన్ 73
చ॥ ఎది తెలియంగరావలెను, నేరు పరీక్షయొనర్చువారునిన్
జదివియెదో యొకండు పరుసన్ మునుభూమిసురప్రతిష్ఠయం
దెదియెదియాచరించిరొ యదేయొనరింపఁ బ్రతిష్ఠ కాదొకో
పదుగురమున్ సహాయముగవర్తిల నేమిభయంబు నీకిఁకన్ 74
క॥ వెనుకటిసంప్రోక్షణమే
మన చేనొనరింపనున్న మధ్య నెవండో
యనఘుండుపుల్ల వేసెను
బొనరింపఁగఁ జేసిరంత భూమిసురునిచేన్ 75
తే॥ వారు వేసినయాత్ర మేటిరుగాను
మనయదృష్టమువలననే మాయమయ్యె
పిలిచిరీసారిమననె,యిప్డెకద మనకు
నాటసాఁగించుకొనుటకు నవసరంబు 76
క॥ "ఇల మేమె బ్రాహ్మణుల"మని
బలిమిన్ వాదించి భంగపఱతురుగాన్
సలిపి ప్రతిష్ఠాకృత్యము
తలవంపులు చేయవలయుఁ దద్విప్రులకున్" 77
ఆ॥ ఇటులనూఱిపోసి యేమేమొ, చివరకు
మొడలువిఱిచి యెట్లొ యొడఁబడంగఁ
జేసిరపుడు రాత్రి చెఱిసగమగు వేళ
కల్పవిద్యుద్దైన యక్క లాడు 78
ఉ॥ చేసి తదాలయంబునకుఁ జేరిచి యూతసనర్థరాత్రియే
బాసటగన్ మెలంగ నటుపైని బురశ్చరణాదికం బెదో
చేసెడివానిచందమునఁ జేరుదురాకలపేరుఁ బూసయాం
పూసలు ద్రిప్పికొంచు రవిపొడ్చెడిదాఁకవసించె నాతఁడున్ 79

ఉ॥ "సత్తు తొలంగి శోభయును జాలకయున్న దియమ్మవారు, బల్
వేత్తయితండు, గాన సలిపించుట బాగు పునఃప్రతిష్ఠ,,యం
చత్తఱి మాదుసంవసథమందలి యాకమసాలెలేగి యా
పెత్తనగాండ్రతోనుడువఁ బ్రీతిస‘‘మంచి,,దటంచుఁబల్కిరున్ 80

తే॥ పెల్లియచ్చటినుండి వే విగ్రహములఁ
బెద్దబావిజలంబులోఁ బెట్టిసరిగఁ
దిరుగఁజొచ్చిరి యందఱకెఱుకగాఁగ
నూర నాయాయికార్యంబు లొనరుచుటకు 81

చ॥ సకలజనుల్ ప్రబుద్ధులయి సాఁగిరి వీధుల సంచరింపఁగన్
బ్రకటితమయ్యె గ్రామమున బాగుగ"నౌనుబ్రతిష్ఠ,యంచు,సం
చకితమనస్కులై ద్విజు లసమ్మతిఁజాటిరి నాల్గువైపులన్
వికటముగం బ్రసంగములు వేమఱుసల్పిరి కాఁపులెల్లెడన్॥ 82

క॥ ఈమాదిరినుండు నెడన్
ధీమంతులుకొంతమంది తేలి మదీయ
గ్రామసభాపతియగు నా
రామయధామంబు ముందరం గూడిరొగిన్ 83

ఉ॥ ఆయెడఁ బెద్దకాఁపునకు నాగమనంబుతటస్థమైన నా
ధీయుతుఁగాంచియిట్లనిమె దిట్ట మదీయసహాయ రుండు"నీ
వే యిటుసల్పఁబూనితొకో యెవ్వఁడో యల్పుఁడుచేయఁదగ్గ యీ
హేయపుఁగార్యమున్ వినిన నేమనియందురు నీదుబంధుగుల్ 84

సీ॥ బ్రాహ్మణసంతృప్తి బహురీతిఁగావించి
సన్నుతుల్ గాంచె నీకన్నతండ్రి
బ్రాహ్మణుం బొడఁగన్న భక్తివిశ్వాసముల్
దద్దఁజూపించె నీపెద్దతండ్రి
బ్రాహ్మణముఖముగా బహుపురాణంబులఁ
దావిన నీపెదతండ్రికొడుకు
బ్రాహ్మణుచే నడ్గఁబడి యథాశక్తిమై
నిచ్చెడివాఁడవే యీవుకూడ

అట్టినీకిప్పు డేలొకో యకటయిట్లు
బ్రాహ్మణద్వేష మేర్పడె బహుళముగను
గాకయుండిన నీరీతిగం గలాదు
చేఁ బ్రతిష్ఠలుచేయింప సిద్ధమగుదె ? 85

తే॥ భువి ద్విజాతులతర్వాతఁ బూజ్యమైన
కమ్మవంగడమున జన్మగాంచినావు
ఊరిలోఁ బెద్దకాఁపువైయుండినావు
కానికార్యముచేయింపఁ గడఁగినావు 86

క॥ మాకుఁ మీకుఁ బార్టీ
యేకాలమునుండియు కల,దిందులకై మీ
రీ కమసాలెలచేతన్
బీకింతురె? ద్విజులునిల్పఁ బెట్టిన ప్రతిమల్ 87

ఉ॥ కమ్మలు లేరొకో యిచటఁ? గతులు లేవొకొ బ్రాహ్మణాళితో
సమ్మతిచేయుచుండిరొకొ సల్పఁగ నిట్టినింద్యకార్యముల్
కమ్మకులానకంతటికిఁ గట్టితిరీరపకీర్తి, కమ్మలే
కిమ్మననీరుమి మ్మొచటికింజనినం గనుఁ డింక మీఁదటన్ 88

ఆ॥ బ్రాహ్మణులకుమీకుఁ బగయున్న వ్యవహార
సరణిలోనఁ జూపఁజనునుగాని
బ్రహ్మకర్మనిట్లు పరులచేఁ జేయింప
బ్రాహ్మణులు జయింపఁబడిరియొకొ 89

క॥ మనధర్మశాస్త్రమునకీ
పనికూడనిదగుటయుండఁ బ్రభుశాసనమున్
గనుగొనినంగూడనిదే
యనుమానమువలదు "నేర"మనుటకు నింకన్ 90

క॥ ఉండినకర్మంబుండఁగ
వెండియుపాకర్మమొండు వెంటఁబడెదున్
గొండొకవడి యోచించుకొ
మ్మండందఱుఁగూడి యొకట, నుడివితిఁగానన్" 91

క॥ అనవుడు "మావాండ్రతనిన్
గొనివచ్చి మఱేదో మిసుకుకొనుచున్నా"రం
చనుచును నటనుండకయిఁకన్
జనియెన్ మెల్లమెల్లనతఁడు స్వస్థలమునకున్ 92

ఉ॥ నాకగపడ్డవారలకు "నాయకుకా" దని యొంత చెప్పినన్
జేకొన కమ్మ్రదూక్తులను "శిల్పి ప్రతిష్ఠయొనర్ప నర్హుఁ"డం
చాకమసాలెవర్ణము నెయాదృతినైన నుతింపఁబూని య
స్తోకవితండవాదములతో నెదిరింపఁగఁబూని రయ్యెడన్ 93

చ॥ అచట జలాధివాసముఁట, యంత నెదో యధివాసమంట, యా
కుచరితులాచరించుచును గుప్పయియుండిరి, రంగవల్లికల్
రచితములై యెసంగె గృహరాజములందును, బిండివంటలున్
బచనము సేయఁగాఁబడియెఁ బల్వురయిండ్ల నివేదనార్థమై 94

ఉ॥ బోనములిచ్చువచ్చుటకు భూసురులేరుఁ దలంపరైరి, యూ
పూనికఁజూచి వైశ్యులును బోవిరమించిరి, "వీరలేరుచున్
బోనపు జెట్టులన్ మనము పోవుద"మంచు విశంకితాత్ములై
మాసిరి తామకూడ నెటో మాకరణాల్ భయమంది యూంక్షకున్

ఉ॥ మాసినవారుమూవలెను మాసియెయుండక యిండ్లవెల్పులన్
లోన నలంకరించి పెసలున్ మినుములన్ ఘృతముఖ్యవస్తువుల్
దేనియమించి యప్పము లుదీర్ణముగన్ సలిపించుచుండి, రే
రే నరుదేరరంచు మదినెంతయు సంశయమందకుండఁగన్ 96

క॥ ఆతఁడె*గరణముశమ్ముఁడు
సీతారామయ్యగృహంబు చెంతకు మరలన్

---

* అస్మద్విరచిత చెన్నకృష్ణచారిత్రము 8 దవపద్యము
సీ॥ అకలంకహృదయుండు సకలగుణాభిరాముఁడు వెంకటప్పందు మొదటివాఁడు
కరణిక మొనరించి ఘనుఁడునాఁబడిమించు రంగయాఖ్యుండు తర్వాతవాఁడు
ప్రాఁతపూఁతలలోన ఖ్యాతుఁడౌ నరసింహరావగుఁ దదనంతరంబువాఁడు
నాలవవాఁడు సంచాలితశత్రుహృత్స్థలుఁడు సీతారామసచివవరుఁడు
ఒలమునందల భీమునిపాటివాఁగఁ। జెలఁగు చినవెంకటప్పయ్య చిన్నవాఁడు
గాఁగఁ దనయులనేవురఁ గరముప్రీతి। సాఁకెనీ చెన్నకృష్ణయ్య జానపాట

బోతినినే నాతనిమది
యేతీరుననున్న యదియో యిప్పుడటంచున్ 97
తే॥ పోయికూర్చుండి యొక్కింత, యాయుదారు
కడకునరుదెంచిపోయెడిఘనులనెల్లఁ
బిలిచి "యగసాలెయనుఁగులేకొలుపుఁడింక"
ననుచు నేమేమొ యాక్షేపమాచరింప 98
ఉ॥ సారెకు స్వర్ణకారజనసంస్తవముంబొనరింపఁబూని య
వ్వారలపక్షమూనినటు వారికిదోఁచెడిలాగు, వారినే
కేరడమాడినట్లు మదికిం బొడఁగట్టెడిలాగునాకు,నీ
తీరునసీతయాహ్వయుఁడు ధీరతమైఁ జరియించె నయ్యెడన్ 99
ఉ॥ "భూసురులేగనప్పు డటుపోయినఁ బిమ్మట వారు యుష్మదా
వాసపుఁగార్యముల్ జరుపవత్తురె"యం చెప రేవి ప్రశ్నమున్
జేసిన సీతయాహ్వయుఁడు చెప్పినదుత్తరమేదొ దేవతా
భ్యాసముఁజేరువాసివలె నయ్యయిచేతలఁ దానటించెఁగా 100
క॥ రూఢిగ మాయూర్క రణాల్
గాఢముగన్ మందలింపఁగడఁగక యీదృక్
ప్రౌఢిమగలవారగుటనె
మూఢజనుల్ గలమురాకు మొనగాండ్రగుటల్ 101
క॥ వారలననువర్తింపక
యేరీతినోయుండునెడల నేగును రవలన్
వారేలేకుండినఁ దమ
నేరుపొకింతయును సాఁగనేరద యూరన్ 102
ఉ॥ అక్కడఁ బెద్దబావిదరి నందఱుఁగూడి సువర్ణఘాతకుల్
చక్కనివిగ్రహంబులకుఁ జందనకుంకమసారభాదులన్
మిక్కిలిపూసి యొప్పగు మేల్వసనంబులుకట్టి బండిపైఁ
బెక్కురుపట్టి పెట్టి యటఁ బెద్దలుకొందఱు కూరుచుండియున్
ఉ॥ "బాగుగనున్నదిప్పు"డని పల్మరుపొంగుచునాత్మలందు నా
రేగఁగఁదీయునప్పటికి హేళి యనిష్టతఁ జండుఁడయ్యెనో

నాఁగ ఖమధ్యఁజేరి కిరణంబుల తైక్ష్ణ్యము నెల్లఁజూపఁగన్
సాగెను, కాల్యకృత్యములుసల్పి భుజింపఁగ లేచి రగ్రజుల్ 104

మ॥ బహువాద్యంబులు మ్రోయ దిక్కులదురన్ బాజారు బాజారునన్
గృహముల్ గల్గినచోటనెల్ల నిలువం బెట్టించుచుం బాడి తు
ద్రహితార్థంబుగ నృత్యముల్ సలుపుచున్ గ్రామంబునందంతటన్
బ్రహరార్థంబుచరించి రుత్సవముతో బత్తుల్ ప్రమోదంబునన్॥

చ॥ "పరిభవకారి యాతనిది బ్రాహ్మణజాతిక" టంచు నెంచియే
జరిపిరి వారలామహము, సత్యముగా నది మాదుజాతికిన్
బరిభవకారియే యగుచుఁ బాగుగ నుత్సవవేళ వీథికిన్
మురియుచు రాగ లజ్జయయి మూలలయందె వసింపఁగాఁబడెన్ ॥106

ఉ॥ భాసురకీర్తియైన యొక పాటివకీలు మదీయ బాంధవుం
డాసమయానవచ్చుటయు నాతనిఁగూడి మదగ్రజుండు నేఁ
జేసితిమప్డు భోజనము, చేసెడిపట్టున నార్యకర్ణసం
త్రాసకరంబులైన పలుతప్పెటచప్పుడు లాలకించుచున్॥ 107

ఉ॥ "ఎక్కడిదింత పాడురొద?" యిట్టులఁ దప్పెట బ్రద్దలయ్యెనున్?
దిక్కులు పిక్కటిల్లగ నుదీర్ణమనుష్యగళస్వనంబులున్
మిక్కిలియౌచునున్నయవి మీనిలయంబులపజ్జనే మఱిం
తెక్కువసే" పటంచు నతఁ డివ్విధిఁ బ్రశ్నముసేయ మమ్ములన్॥

ఉ॥ ఉన్న చరిత్రమంతయును నొయ్యనఁ జెప్పినవారమైతిమే
మన్నుడువుల్ వినంబడినయంతనె యాతఁడు విస్మితాత్ముఁడై
"మొన్నడుఁజూడ మిట్టిపని, యియ్యది యెంతయొగొప్పతప్పు, మీర్
క్రన్నననేగి చార్జియిడఁ గార్యముసర్వము చక్కనయ్యెడున్"॥ 109

క॥ అని యేమేమో సంగతు
లనుకూలముగన్ వచింప నందఱమున్ భో
జనముం జేసితి, మంతటఁ
జనియూరేగించుకొనుచుఁ జయ్యనబత్తుల్॥ 110

సీ॥ పద్మినీపద్మినీ పద్మినీరమణుండు
శతకోటిశతకోటి సితశరుండు
కువలయకువలయ కువలయమిత్రుండు
హరిపుత్రహరిపుత్ర హరిమూర్తి
వాహినీవాహినీ వాహినీనాథుండు
బలహారబలహార పార్థివుండు
మణిరాజమణిరాజ మణిరాజహసరుండు
కలధౌతకలధౌత కులధరధృతి
యనఁగనుతికెక్కె శరహీరహారతార
హారవిందారిమౌళిమందారసార
కాండపారదశారదకందకుంద
చారుకీర్తి ప్రదీపరాట్చక్రవర్తి 103

తే॥ అతనిభార్య సునంద నేత్రారవింద
చారుసమ్మోహకృద్విలాసరసకుంత
మధురవాగ్జితమకరంద మహితరూప
సురుచిరానందసంభృత సుగుణబృంద 104

క॥ కుందమ్ముల బృందమ్ముల
యందమ్ముం జెఱుచు విద్రుమాధరి రదముల్
కెందమ్ముల చందమ్ముల
మందమ్ములుగా గణించు మానిని పదముల్ 105

తే॥ చంద్రబింబాస్య ముఖవిలాసంబునకును
సరసపుష్కరవిభవంబు జలదరించు
సారసానన రమ్యతకోరువులకు
సరసపుష్కరవిభవంబుజలదరించు 106

ఆ॥ పాముగోముసోము బలువైనచీమః
బారుతీరుగేరు నారుసారు
మేటితేటికోటి పాటింప దలపుష్ప

చాపుమూపు రూపుమూపు చూపు 107

సీ॥ విరిరీతినిరసించి కరిజాతిని హసించి
గొడలును నడలును బెడగుచూప
పగడాలజిగిసేలి మగరాలవగఁబోలి
పదములు రదములు బాగుమీఱ
వలయమ్ములనుగేరి జలజమ్ములనుమీఱి
శ్రోత్రముల్ నేత్రముల్ సొంపెసంగ
వరభృంగతతినొంచి సురధాంగగతిమించి
వేణియు శ్రోణియు వింతదనర
రమణగన్నట్టిసుందరీరత్నమునకు
సాటియే యెన్న వరనరసాధ్యనాగ
గరుడగంధర్వసిద్ధకింపురుషయక్ష
కాంతలైనను గీర్వాణకాంతలైన 108

సీ॥ నెలతాల హరిసిలములఁ జాలఁ గన్పట్టు
కనునీయకృతకాద్రికందరముల
నిగరాల నగరాల జిగిగ్రాల నభ్రంక
షములైన వరచంద్రశాలలందు
హేంరాళమాంరాళధాంరాళగతిరూఢిఁ
దిలకించు కాసారతీరములను
జందనస్యందనకుందనవరసాల
వరసాలశృంగారవనులయందు
మహితలీల సునందతో మదనకదన
గతులఁదేలుచుఁ బరిరంభచతురవచన
రచన లలవడ భోగాప్తి రహివహించెఁ
జారుమూర్తి ప్రదీపరాట్చక్రవర్తి 109

క॥ ఈరీతిఁ గొన్నిదినములు
నారాజన్యుండు సంతతానందముల¶

నారీమణి నేలుచు సుకు
మారుఁడు లేకునికి తలఁచి మది నిట్లనియెన్ 110
తే॥ "నందనుఁడు పితృజనుల కానందనుండు
పుత్త్రుఁడు గురుప్రమోదైకపాత్రుఁ డరయ
సూనుఁ డనిశంబు కులవర్ధమానుఁ డుర్వి
సుతుఁడు గలతండ్రి విబుధసన్నుతుఁడు కాడె 111
చ॥ జిలిబిలిముద్దుమాటలును జెక్కుఁదొట్రిలు లేఁతనవ్వునం
కులు పులిగోరు నేవళము గొప్పగుగజ్జెలు చిన్ని మద్దికా
యలు జిగిమించు టుంగరము లందెలు గల్గి చెలంగి యాడుచున్
వెలసెడిసూనుఁ జూడ సరవిన్ మదిఁ దండ్రికి నెంత వేడుకో 112
సీ॥ జిగిగబ్బిగుబ్బలబిగువు కౌఁఱుంతయ్యుఁ
బొంకమ్ముగాఁ గనుబింక మొప్ప
మంజులసత్కళామగ్నత గలిగియు
బహుళలీలావాప్తి ప్రబలియుండు
అతులితనవయౌవనారూఢిఁ బొసెయు
మహితమోహన మహామహిమ వెలయు
పొగడొందు మేనిసోయగము తక్కువయయ్యు
శృంగారవిస్ఫూర్తి చెందియుండుఁ
దల్లి కుల్లాసముగ నుండఁ దత్సతీమ
తల్లిమానసమను పాలవెల్లి కెంచి
చూడ జాబిల్లిగా చిన్నిసుతుఁడు ధరను
వరుసఁగోఁ బుత్త్రలాభంబె పరమహితము 113
తే॥ సకలసామ్రాజ్యవిభవంబు చాలఁగలిగి
నందనశ్రీవహింపని నరుని బ్రదుకు
దళలతాంతగుళుచ్ఛసంతానమగుచుఁ
గాపుఁబట్టనివృక్షంబు కరణిగాదె॥ 114
క॥ తగ మది నశ్రాంతంబును। జగతీస్థలి నెంచిచూడ సరవి" నపుత్త్ర

స్వగతిర్నాస్తి "యటంచవి॥ నిగమంబులువల్కువేవినిర్మలమహిమన్ ॥

ప్రతీపుఁడు తీర్థయాత్రఁబోవుట.

వ॥ అనితలపోయుచు మంత్రులపై రాజ్యభారంబునిచి బంధుమిత్రగురుబుధానుమతంబున సుముహూర్తంబునఁ బురోహితుండును గొందఱుత్తైర్థికులును సునందాసుందరీరత్నంబుఁ దాను సమందానందకందళితహృదయారవిందుండై ప్రతీపవసుంధరారమణుండు తీర్థావగాహనోత్సాహంబునఁ జనిచని యచ్చటచ్చట నెదుర్కొని విశ్వంభరాభర్తలొసంగు కానుకలుగైకొనుచుఁ బుణ్యతరంగిణీనివహంబుల సుస్నాతుండగుచు యజనయాజనాధ్యయనాధ్యాపనదానదానప్రతిగ్రహషట్కర్మనిరతులగు భూసురోత్తములకు గోభూహిరణ్యసాలగ్రామాది దానంబు లనేకంబులిచ్చుచు యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణాసమాధ్యష్టాంగయోగవిశారదులగు యోగీశ్వరుల సందర్శించి సాష్టాంగదండప్రమాణంబులాచరించి వారలొసంగు బహువిధాశీర్వాదంబులుగైకొనుచు నార్యజనంబులచేత సావధానంబుగాఁ బురాతనపుణ్యకథావిధానంబులు దెలియుచు రోహిణీకాంతకాంతాలవాలసంస్తూయమానగోస్తనీకాయమానవిభ్రాజమానంబులగు వనంబుల స్వచ్ఛతరచ్ఛత్రోపమానశీతలతరుచ్ఛాయలఁ బరిశ్రమంబుపాయ విశ్రమింపుచు నగణ్యాభయదమృగశరణ్యంబులగు గిరివరేణ్యంబుల గడచుచు దుర్గమస్థలంబుల నిర్గమింపుచుఁ జనిచని సంతతామోదమేదురవిమలకోమలకుముదకువలయబృందమకరందతుందిలభృంగీసంగీతస్వానానుషంగయు నుభయకూలస్థితదేవర్షిబ్రహ్మర్షిరాజర్షికృతప్రసంగయు రంగదంభస్తుంగతరంగయు నగు గంగంగనుంగొని యారాజపుంగవుండు నిజకులాంగనకిట్లనియె॥ 116

గంగానదివర్ణన

లయగ్రాహి॥ అంగన! ముదంబునఁ గనుంగొనుము శాబకకు
రంగహయధూతవరభంగచయసంగ
రంగ దరవిందగతభృంగరవపల్లవిత

తుంగతటభూరిహృదయంగమకుడుంగ!
జంగమకులాచలనిభాంగఘనజీవనమ
తంగజభయానహరధాంగకవిహంగ!
మంగళపవిత్రజలసంగతసరస్వతిప
తంగతనయామిళదభంగగుణ గంగ! 117

సీ॥ ఈసరస్వతికి మత్తేభేంద్రగామిని!
పురుషోత్తముని యంఘ్రి పుట్టినిల్లు
ఈమహాప్రవాహిని కెలనాగ! మదనసం
హరుజటాజూటంబు మందిరంబు
ఈతరంగిణికిఁ బూర్ణేందుబింబానన!
యమునాసరస్వతు లనుఁగుఁజెలులు
ఈనిమ్నగామిని కేణాక్షి!జనపాత
కోత్కరహరము ప్రయోజనంబు
ఈస్రవంతికి నెన్న మృగేంద్రమధ్య!
భాస్వరాఖర్వసర్వసుపర్వసిద్ధ
సాధ్యభుజగాళి సేవకసముదయంబు
దీనిమహిమంబు బ్రహ్మకుఁ దెలియఁదరమె" 118

వ॥ అనిపలికి తత్తీరంబున 119

క॥ నిలిచి నమస్కారంబులు। సలలితమగనాచరించి సంభ్రమమొప్పన్
లలిఁ బులకాంకురపాళీవిలసితతనుఁడగుచు మఱియువిభుఁడిట్లనియెన్

సీ॥ "ఈరాజహంసంబు లిభకుంభకుచకుంభ!
నీగమనంబుతో నేస్తమాడు
ఈచక్రవాకంబు లిందిందిరాలక!
నీదుపాలిండ్లతో వాదులాడు
ఈజలజాతంబు లేణాక్షి!నీముఖ
చంద్రబింబంబుతో సరసమాడు

ఈయుత్పలంబులు హేమాంగి!నీదీర్ఘ
లోలనేత్రములతో మేలమాడు
ఈమృణాళంబు లెన్నఁగా నింతి!నీదు
బాహువులతోడఁ జెలరేగి పంతమాడు
విని నెల్లను వేర్వేఱ విశదముగను
వేడ్కఁగనుఁగొంటె గంభీరవేదిగమన!" 121

మ॥ అని భూకాంతుఁడు పల్కుచుండఁగను గంగాభంగరంగత్తరం
గనికాయప్రచలత్ప్రఫుల్లకమలౌఘస్వచ్ఛగంధానుఖే
లనరాజన్మధులిట్ప్రసంధయకులశ్లాఘ్యోల్లసద్గానని
స్వనముల్ గ్రమ్మఁగ నేగుదెంచె వరచంచత్సీతవాతూలముల్ 122

క॥ ఈగతిఁ జనుదెంచిన బహు
ళాగతసంమోదుఁడగుచు నతివయుఁ దానున్
వేగమె కైదండఁగొనుచు
భాగీరథితరఁగలందుఁ బరమప్రీతిన్ 123

క॥ స్నానములుచేసి యంతట। దానంబులుచేసి హరికథాశ్రవణమునన్
మానసముప్పొంగఁగ న।మ్మానవపతియుండెఁగొన్ని మాసములచటన్

వ॥ అటఁ గదలి నీలాచల భద్రాచల మంగళాచల సింహాచల గరుడాచల శేషాచల ద్వారకాపుర మధురాపుర ధర్మపుర కాంచీపుర మారకాపుర శ్రీరంగ శ్రీకూర్మ హరిక్షేత్రాది వైష్ణవక్షేత్రంబులును కేదార త్రిపురాంతక శ్రీశైల చిద్గగన గోకర్ణ జంబుకేశ్వర రామేశ్వర కాశీ కాళహస్త్యాది శైవక్షేత్రంబులును గనుంగొని యమునా సరస్వతీ గోదావరీ చంద్రభాగా గండకీ కృష్ణవేణీ కుముద్వతీ వేగవతీ వేత్రవతీ వేదవతీ శుక్తిమతీ తుంగభద్రా సౌభద్రా శతభద్రా భవనాశిని నర్మదా తామ్రపర్ణీ కావేరీ ప్రముఖ పుణ్యతరంగిణీనివహంబులఁ గృతస్నానుండై పద్మసరసి యింద్రసరసి బ్రహ్మసరసి మానససరసి మొదలగు సరసుల నవగాహనంబు సేసి శార్ఙ్గకోటియుఁ జక్రకోటియు శంఖకోటి

యుఁ జంద్రకోటియు ధనుష్కోటియుఁ గనుంగొని మజ్జనంబాడి దండకారణ్య నైమిశారణ్య బదరికారణ్య చంపకారణ్యంబులు వీక్షించి కృతకృత్యుండై క్రమ్మఱి నిజపురంబగు గజపురంబునకేతెంచి ధరణీపాలనంబొనర్చుచుఁ గాంతయుం దాను నిష్టోపభోగంబు లనుభవింపుచు సుఖంబుండె, 125

క॥ రతిబంధప్రతిబంధము। రతికూజితవైభవాంతరాయము విలస
ద్రతిపతియుద్ధవిరుద్ధం। బతులితగతి సతికి గర్భమంతటనిలిచెన్ 126

.సునందగర్భోత్పత్తి.

సీ॥ బంగారమునకు మెఱుంగువెట్టినరీతిఁ
గాంచనాంగి శరీరకాంతి మెఱసె
తెలికల్వ రేకులఁబోలుచు వెన్నెలఁబోలి
చానకన్నులఁదెల్పు చాలఁదనరె
కులధరంబులమీఁది జలధరంబులమాడ్కి-
నాతిచన్మొనలంచు నలుపుగలిగె
పుట్టపైఁ జరించు భుజగంబుచాడ్పున
సతినాభిపై నారు సాంద్రమయ్యె
గంధగజయాన లేఁగౌను గానవయ్యె
భాసురాంగికి వేవిళ్ళు బహుళమయ్యె
మానినీమణినడ యతిమంధమయ్యె
చంద్రబింబాస్య వళు లదృశ్యంబులయ్యె 127

తే॥ అబ్బురపు గుబ్బమొనలు కృష్ణాప్తినొందఁ
గలికినెమ్మొగ మర్జునఖ్యాతిగాంచె
సహజసన్మిత్రవిభవంబు సంఘటిల్ల
దౌహృదము కామినీమణి దాల్చునపుడు 128

ఉ॥ "సొమ్ములుదాల్పవేటికిఁ గృశోదరి! సారెకు వాపులేర్పడన్
మమ్ములఁజీరవేటి కణుమధ్య!" యటంచుఁ బ్రియాళు లెక్కస

క్కమ్మగనాడ సోగకను(క్రేవల లేనగవంకురింపఁగాఁ
గొమ్మ మొగంబు (వ్రీడమెయిఁ గొంతటు(వాల్పఁ(బపూర్ణగర్భయై
వ॥ అంత, 130

చ॥ కలశపయోధివీచి యలకల్పకముంగనినట్లు వేడ్కమైఁ
గలశపయోధికూర్మిసుత కంతునిగన్నటు లిం దపంచమ
త్కలశపయోధిపొంగఁగఁ దగన్ శుభలగ్నమునందుఁ గాంచె న
క్కలశపయోధరీమణి సుఖస్థితిమీఱఁ గుమారచంద్రునిన్ 131

క॥ జగతీశ్వరుకళనుద్భవుఁ
డగుచిన్నికుమారుకాంతి యంతఃపురమొ
ప్పగ వెలిఁగెన్ విధుఁడుదయిం
పఁగఁ దగ వెలుఁగొందుపూర్వభాగమువోలెన్ 132

క॥ మధురాపురివర్ణితమగు।బుధుబాలునిగనెడివేళ భువి వనరాసుల్
మధులోపాముద్రావర।విధూదయశ్రీల సందు విభవముతగ్గెన్ 133

క॥ దిక్కులు తెలివి రహించెను
(పక్కులవానలురహించె (శావ్యముగఁ బయో
ముక్కులు ఘోషించెను దివి
నక్కులదీపకుని మంగళాభ్యుదయమునన్ 134

ఆ॥ మనసిజాతు మారమణిగన్నయట్లు నా
మను సుఖాప్తినదితిగనినయట్లు
మన సునంద చిత్రముగ సునందనుగనె
మనసు నందమయ్యె మనకునెల్ల 135

వ॥ అని జనంబెంచుచుండ నప్పుడు, 136

శా॥ "సూనుం డుద్భవమయ్యె"నన్న విని విస్ఫూర్తిం (బదీప(పభుం
డానందంబున సూతికానిలయమధ్యక్షోణికింబోయి వే
తౌ నా నందను నాననంబు పొలుపొందంజూచి మిన్నందుచున్
స్నానంబాడి సుశోద్భవోత్సవము హెచ్చం జేసెనుత్సాహియై 137

# చందాదారులు

1 కోలా పిచ్చిరెడ్డిగారు- విలేజిమునిసీభ్-దాచేపల్లి
2 వెలిదెండ్ల సుబ్బారావుగారు- దాచేపల్లి
3 పాకాల నాగభూషణంగారు- సన్నెగండ్ల
4 గాదె శ్రీశైలముగారు- సన్నెగండ్ల
5 రామరాజు వెంకటహనుమంతరావుగారు- పెదకొదమగుండ్ల
6 చింతపల్లి రాఘవయ్యగారు- కరణము- చింతపల్లి
7 పిరాట్ల సత్యనారాయణగారు- చింతపల్లి
8 చింతపల్లి రామస్వామిగారు- ఆ॥ కరణము- గాదెవారిపల్లి
9 గోగుల లక్ష్మీనారాయణగారు- కరణము- గోగులపాడు
10 జానపాటి సీతారామయ్యగారు- దామరచెర్ల
11 పెద్దిభట్ల కృష్ణమూర్తిగారు-స్పెషల్ రివిన్యూయినస్పెక్టరు తెనాలి
12 వేమూరు వెంకటసుబ్బయ్యగారు- రివిన్యూయినస్పెక్టరు అమ్మనబ్రోలు
13 రాజశేఖరుని రామకృష్ణయ్యగారు బ్రాహ్మణపల్లి
14 వెంకటపాపారాయభారతీనిలయము- మైలవరము
15 తూములూరు కోటయ్య- పినపాడు
16 కృత్తివెంటి గంగరాజుగారు- బందరు
17 అన్నమురాజు సుందరరామయ్యగారు- విలేజిమునిసీభ్ ఎఱ్ఱగుంటపాలెము
18 వేదుల సత్యనారాయణశాస్త్రిగారు కాకరపర్తి
19 తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రిగారు చందోలు
20 గోపాలుని నరసయ్యగారు గన్నెపల్లి
21 చిరుమామిళ్ల లక్ష్మీనారాయణప్రసాదుగారు డిప్టీతహశీల్దారు మాచెర్ల
22 జంధ్యాల నారాయణమూర్తిగారు పంపింగు డిపార్టుమెంటు సూపరువైజరు మదరాసు
23 లంకా అంబయ్యశాస్త్రిగారు- అంబాపురం
24 దూపాటి తిరుమలరమణాచార్యులుగారు- శతావధాని వినుకొండ

## ప్రధానపోషకులు

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారు.

2 శ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహాదరు
జమీందారుగారు గంపలగూడెం

## పోషకులు.

1 శ్రీ రాజా నారయప్పారావు సింహాద్ర్యప్పారావు బహదరు
జమీందారులు, నూజవీడు.

2 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి

3 రామసింగుగారు నెల్లుట్ల షాపురపు సంస్థానము మానేజరు నెల్లుట్ల

4 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు

5 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు మక్తాదారు చోల్లేరు

6 బీరకాయలరామారావు దేశముఖుగారు రాయగిరి

## సహాయులు.

1 అన్నమురాజు సుబ్బారావుగారు నందూరు

2 నందూరు నరసింహారావుగారు, కరణం, నందూరు.

3 నైషధము సీతాకాంతముగారు మోరంపూడి

4 మదను శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి.

5 పరాంకుశరావు దేశముఖుగారు యాడారం

6 కుప్పా శంకరశాస్త్రిగారు, చిపలూరు.

7 గంభీరరావు దేశాయిగారు, లింగన్నపేట.

8 నారసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద.

9 కొండపల్లి అనంతరామయ్యగారు, వకీలు. జోనగాం

10 పిరాట్ల సీతాకాంతముగారు, చింతపల్లి.

11 కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట.

12 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.

13 చెన్నూరు రామంగారావు దేశపాండ్యాగారు, పెదవీడు.

14 వాసిరెడ్డి వెంకటయ్యగారు చేబ్రోలు.

15 వెలగూరి పిచ్చయ్యగారు, కొడమగుండ్ల.

16 తుమ్మలగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.

17 వెంకటరామకవులు, పల్నాడుతాలూకా

18 దొమకూరి బ్రహ్మానందశాస్త్రులుగారు గుంటూరు.